ననే భయము నాకు లేకపోలేదని నేను ఇదివరకే మనవి చేశాను. ఐతే నా అభిప్రాయం తెలుగులో చెప్పవద్దని కాదు తప్పకుండా మాతృభాషలోనే చెప్పుకోవాలి కాని ఎప్పుడు అన్న సమయమును మనము నిర్ణయము చేసే కంటే దానిని విశ్వవిద్యాలయాలు ఇంటర్ యూనివర్శిటీ లెవెల్‌లో తీర్మానించడానికి వారికి వదలిపెట్టడమువల్ల ఎక్కువ శ్రేయస్సు ఉంటుంది విశ్వవిద్యాలయాలవారు గొప్ప విద్యావేత్తలు - పెద్దలు, అట్టివారికి యీ సమస్యా పరిష్కారము వదలిపెట్టినట్లయితే మనకు ఎక్కువ సేఫ్టీ ఉంటుంది అని నా అభిప్రాయము అలా కాకపోతే ఇప్పుడు యీ రాష్ట్రములోనే రెండు మూడు భాషలలో చదువు చెప్పవలసి వస్తుంది ఈ రాష్ట్రములో తెలుగువారు హెచ్చు సంఖ్యలోనున్నారు ఉరుదు నేర్చినవారూ, ఉరుదూ మాతృ భాషగా గలవారున్నారు, కన్నడ భాషవారున్నారు, మరాటీ భాషవారున్నారు, యీ విధముగా వివిధ భాషలవారికి ఏ భాషలో చెప్పాలి అనేటప్పటికి కొంత confusion రాకపోదు ఇది ఇతర రాష్ట్రాలకు కూడా సంబధించిన ప్రశ్న కనుక కొంచెము నిదానంగా జాగ్రత్తగా మెళుకువతో చేసుకొనవలసిన పని కనుక యీనాడు ఆ మార్పును ఒకేసారి అమాంతము తీసుకొని రావడము సమంజసం కాదు, తీసుకొని రావలసిన అవసరముకూడా లేదని నా అభిప్రాయము ఐతే పి యు సి లో ఎక్కువ స్టాండర్డు ఉంటున్నదని కోర్సెస్ ఆఫ్ స్టడీ ఎక్కువగా ఉంటున్నవని ఒకేసారిగా ఇంగ్లీషులోనికి మార్చడమువల్ల కొంత ఇబ్బంది పడుతున్నారని మన సభ్యులు నా దృష్టికి తెచ్చినమాట వాస్తవమే. అది నాకు కూడా ఇదివరకే కొందరు విద్యార్థులు, విద్యార్థినులు చెప్పారు నేను ఆ విషయమును విశ్వవిద్యాలయాల వారి దృష్టికి తెచ్చాను విద్యార్థులకు పోర్షన్ హెచ్చుగా ఉండడమేగాక ఒకేసారి భాష మారడమువల్ల వారికి ఇబ్బంది కలుగుతున్నది కాబట్టి బాగా యోచనచేసి దానిని ఏ విధంగా మార్పుచేయాలనే విషయంలో ఒక నిర్ణయము తీసుకోవడము మంచిదని విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులవారికి చెప్పాము. వ్రాశాముకూడా. యీ విషయము సమగ్రంగా చర్చించి ఏ standards నిర్ణయిస్తే బాగుంటుందో యోచన చేయవలసినఅవసరము ఉన్నదనే విషయం కూడా గట్టిగా వారికి చెప్పాను అంతకన్నా మనము ఎక్కువ చేస్తే interference అంటారు విశ్వవిద్యాలయాలకు అటానమీ ఉన్నది. వారు కొన్ని నిర్ణయాలు తీసుకుంటారు విద్యాధికులు, ప్రవీణులుగల సంఘములున్నవి వారికి. బోర్డు ఆఫ్ స్టడీస్, లేక ఎకడమిక్ కౌన్సిల్సు వారికి ఉన్నవి వాటిలో ప్రత్యేకమైన నిపుణులున్నారు వారి అభిప్రాయమునకు భిన్నముగా మనము సూచనలు చేయడానికి వీలుండదు. కాని గట్టిగానే సూచన చేశాము. వారు ఏవిధముగా నిర్ణయము తీసుకుంటారో మనము wait చేసి చూడవల

సినదేగాని ఇప్పుడు మనము చేయగలిగినది అంతకంటే ఎక్కువేమీ లేదని మనవి చేస్తున్నాను

పి యు సి లో ఎన్నో సబ్జక్ట్సు అనవసరముగా పెట్టారని కొందరు చెప్పారు సైన్సువాళ్ళు హిస్టరీ చదవాలంటున్నారు హిస్టరీవాళ్ళు జాగ్రఫీ చదవాలంటున్నారు జాగ్రఫీవాళ్ళను సైన్సు చదవాలంటున్నారు ఇవన్నీ అనవసరమేమో, ఇవి ఎందుకు పెట్టారు అనే సంగతికూడా నా దృష్టికి తెచ్చారు ఇది విశ్వవిద్యాలయాలు ఆలోచించి చేసిన నిర్ణయమే పి యు. సి కోర్సు మొదలుపెట్టి ఒక సంవత్సరము అయినది కొన్ని ప్రాంతములలో 2 సంవత్సరము లైనది ఇటువంటి కష్టాలున్నప్పుడు విశ్వవిద్యాలయాలవారు యోచన చేసి సరిఅయిన శ్రద్ధ వహిస్తారని నేను అనుకుంటున్నాను ఏవైనా మార్పులు అవసరమైతే వారు చేస్తారని అనుకొంటున్నాను ఏ ఉద్యోగములో చేరినా, వర్తకమునకు వెళ్ళినా జనరల్ నాలెడ్జి ఆఫ్ సబ్జక్ట్సు కొంత అవసరము స్కూల్ ఫైనల్ వరకయినా హిస్టరీ, జాగ్రఫీ మొదలయిన అన్ని సబ్జక్ట్సులోనూ కొంత నాలెడ్జి అవసరమని విశ్వవిద్యాలయాలవారు భావించి ఉండవచ్చు మనదేశానికి ఇతర దేశములకు జరిగే వర్తక వాణిజ్యములలో చిన్నచిన్న ఉద్యోగాలు చేస్తున్నవారున్నారు ఇంగ్లండునుంచి కానివ్వండి, అమెరికానుంచి కానివ్వండి, చైనానుంచి కానివ్వండి, జపాన్‌నుంచి కానివ్వండి, ఏదేశమునుంచి వచ్చినవారితోనైనా డిస్కస్‌చేస్తే వారికిగల జనరలు నాలెడ్జి బోధపడుతుంది వారు డిగ్రీ హోల్డర్సు కాకపోవచ్చు యూనివర్సిటీలలో పెద్ద చదువులు చదివి ఉండకపోవచ్చు కాని వారికి స్టాండర్డు ఆఫ్ జనరల్ నాలెడ్జి హెచ్చుగా ఉంటుంది ఏ విషయమునైనా చెప్పగలుగుతారు ఇది ప్రోగ్రసివ్ కంట్రీసులో ఉన్న విద్యావిధానంలోని మంచిగుణము స్కూల్ ఫైనలు పరీక్ష మొదటి గవర్నమెంటు పరీక్ష పి యు. సి యూనివర్సిటీ వారి మొదటిపరీక్ష కనుక అంతవరకైనా కొంత జనరలు నాలెడ్జి ఆఫ్ ఆల్ సబ్జక్ట్సు అవసరమేమోనని భావించి విశ్వవిద్యాలయాలవారు నిర్ణయము చేసిఉంటారని నేను అనుకుంటున్నాను. అందువల్ల దానిని ఇపుడు మార్పుచేయమని చెప్పేకంటే అనుభవము మీద విశ్వవిద్యాలయాలవారే ఏమిచేయాలో ఆలోచిస్తారని నేను భావిస్తున్నాను.

కొవ్వూరు నియోజకవర్గ సభ్యులు గా శ్రీ రాఘవులుగారు యూనివర్సిటీ సిండికేటులో ఉన్నారు. వారికి ఆ కష్టసుఖాలు తెలుసు. యీ బిల్లును

సపోర్టుచేస్తూ వారు చెప్పిన మాటలను, సలహాలనూ యూనివర్శిటీ సిండికేటులో తెలియచేసి తగినటువంటి చర్య తీసుకొంటారని కూడా నేను భావిస్తున్నాను

ప్రతిపక్షనాయకులు ఇంకొక విషయము చెప్పారు హిందీభాష అవసరమేమిటి? హిందీ నిర్బంధముగా ఎందుకు బోధించాలి? ఎక్కడో ఉద్యోగము చేసుకొనేవాడికి మరో నౌకరీ చేసుకొనేవారికి స్కూల్ ఫైనల్‌లో హిందీ అవసరమేమో కాని ఇతరులకు హిందీ లేకపోతే గడవదా? హిందీ నిర్బంధము చేయడమువల్ల మనకు నష్టము ఉంటుంది అనే విధముగా వారు శలవిచ్చారు నేను ఒక ప్రశ్న వారిని అడుగుతున్నాను ఒక గుమస్తాగా సెక్రటేరియట్ ఆఫీసులో గాని, మిల్లులో గాని, వాణిజ్యసంస్థలో గాని పనిచేసేటప్పుడు వారికి Natural Science అవసరం లేదు Botany అవసరము లేదు కాని యస్ యస్ యల్ సి లో ఈనాడు ఎందుకు సైన్సు బోధిస్తున్నారు? అందువల్ల యస్ యస్ యల్ సి లో సైన్సు సబ్జక్టు అక్కరలేదని, ఒమిట్ చేద్దామని అంటామా? అది సబబుకాదు యీ వేళ స్కూల్ ఫైనలు చదివేవాడు సైన్సు సబ్జక్టు కంటే హిందీ చదవడము వల్లా, హిందీని నిర్బంధము చేయడంవల్ల హెచ్చు ప్రయోజనం ఉన్నదని నేను మనవిచేస్తున్నాను హిందీ దేశభాష ఒక్క దక్షిణదేశము విడిచిపెట్టి ఎక్కడకు వెళ్ళినా హిందీ తెలియకపోతే కొంచెం కష్టము అవుతుంది మన రాష్ట్రములో చదువుకొనే వారందరిని మన రాష్ట్రములలోనే పెట్టుకొనడానికి వీలులేదు. ఆల్ ఇండియా సర్వీసెస్ ఉన్నాయి ఆల్ ఇండియా సర్వీసెస్‌కు వెళ్ళేవారికి కొంత హిందీ అవసరం కాని యీ నాడు హిందీ దేశభాష రేపు ఏ విధంగా కేంద్రప్రభుత్వంవారు నిర్ణయిస్తారో తెలియదు హిందీ విషయమై కాన్‌స్టిట్యూషన్‌లో ప్రొవిజన్ ఉన్నది. కనుక మనము హిందీని నిర్బంధము చేసుకోవడంవల్ల దక్షిణదేశంలో ఉన్నటువంటి ఇతర స్టేట్సుకంటే ఎడ్వాంటేజెస్ పొజిషన్‌లో మన ప్రజలుంటారని సవినయంగా మనవి చేస్తున్నాను. హిందీని యీవాళనే నిర్బంధము చేయలేదు వాళ్లు సంవత్సరాలకు పూర్వమే ప్రవేశపెట్టారు. యీ సంవత్సరమునుంచీ నిర్బంధము చేయడము ప్రారంభించారు. నిర్బంధము చేయడము అంటె ఇంగ్లీషు భాషతో పాటు మాతృభాష తెలుగుకాని, ఉరుదుకాని వాటితోపాటు సమానంగా మార్కులు రావాలని చెప్పరు. విశ్వవిద్యాలయాలవారు దీనిని గురించి ఒక నిర్ణయము చేయవలసి యున్నది ఏదో తక్కువ మార్కులు పెట్టవచ్చు 15, 20 మార్కులు పెట్టవచ్చు. కాని హిందీ భాషాజ్ఞానము అవసరము తెలుగు ప్రజలలో హిందీ అంటే అభిలాష ఉన్నది. హిందీలో పండితులయినవారు తెలుగువారు హెచ్చుగా ఉన్నారు దక్షిణభారత హిందీ మండలిలో హిందీ

పాసైయినవారి లిష్టులుచూస్తే తెలుగువారే ఎక్కువగా హిందీ పాసవుతున్నారు. ఉపాధ్యాయులుగా తెలుగువారే హెచ్చుగా వస్తున్నారు హిందీ భాషపై అటువంటి అభిలాష మన ప్రజానీకంలో ఉన్నది అందువల్ల హిందీని నిర్బంధముగా పెట్టడమువల్ల మనకు లాభమే హెచ్చుగా ఉన్నదని మనవి చేస్తున్నాను ఎక్కువ భాషలు నేర్చుకోవడము మంచిదే కాని వాటినన్నిటినీ compulsory చేయడము సాధ్యము కాదు యీనాడు ఇతరదేశమునుండి వచ్చిన ఇంగ్లీషు కంపల్‌సరీగా ఉన్నపుడు మనదేశంలో రేపు ప్రభుత్వభాష కాబోయే హిందీని నేర్చుకునే అభిలాష ప్రజలలో ఉన్నప్పుడు కంపల్‌సరి చేయడములో కష్టమేమీ లేదని మనవి చేస్తున్నాను

కరస్పాండెన్సు కోర్సెస్ పెట్టడము మంచిదని దానివల్ల ఎక్కువమందికి లాభముంటుందని ప్రతిపక్ష నాయకులు ఒక మంచి సూచన చేశారు ఆ విషయాన్ని పరిశీలన చేయవలసినదిగా విశ్వవిద్యాలయాలవారిని కోరుదాము అప్పుడే మన మూడు విశ్వవిద్యాలయములలో కొన్ని క్రొత్త కోర్సులు పెట్టారు బిజినెస్ ఎడ్మినిస్ట్రేషన్, సెక్రటేరియట్ కోర్సు మొదలయినవి పెడుతున్నారు ఇవి ప్రజానీకానికి ఎక్కువ అవసరమైన క్రొత్త కోర్సులు ఈ బిల్లు సందర్భంలో మాట్లాడారే గాని, యిప్పుడు అప్రస్తుతమని మనవి చేస్తున్నాను అవి రెగ్యులర్ స్టడీస్ లేకుండా ప్రైవేటు స్టడీచేసి వెళ్ళవలసిన సబ్జెక్టులు కావు Business Administration కి గాని, Public Administration కి గాని, కొంత theory, కొంత practice అవసరం అందుచేత అన్ని సబ్జెక్టులకు private study, 'irrespective of standard' చేయటానికి వీలులేదు Private study కి అవకాశం ఉండదు అయినా, వారికి సలహా యిద్దాము ఈ సలహా మంచిదే వారు ఏవిధంగా చేస్తారో చూద్దాము Day-to-day administration కు కావలసిన courses లో యీ మార్పులు చేయాలని చెప్పడం మంచి సలహాయే, విశ్వవిద్యాలయంవారి దృష్టికి తెస్తానని మనవిచేస్తున్నాను

శ్రీ ఎక్కోటేగారు మాట్లాడుతూ, మూడు విశ్వవిద్యాలయాల చట్టాలను పరిశీలనచేసి సమగ్రంగా మార్పులు తేవలసిన అవసరం ఉన్నదని చెప్పారు. కాని యిప్పుడు యింకా యితర urgent subjects ఉండగా అది కుదరదు. ఉస్మానియా యూనివర్సిటీ చార్టర్‌ను ఎప్పుడో revise చేసి మార్పులుచేశామని వారు సెలవిచ్చారు దానిని up-to-date గా తీసుకురావటానికి ప్రభుత్వం నిర్ణయం తీసుకున్నది. దానికి ఒక కమిటీనికూడ వేశారు. దానిని గురించి పరిశీలనచేస్తున్నారు, త్వరలో up-to-date గా తీసుకురావటానికి ప్రయత్నాలు జరుగుతున్నాయని

మనవిచేస్తున్నాను శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం యాక్టు తయారుచేసి మూడు సంవత్సరము లయినది తేడాలు ఉంటే సరిచేసుకొందాము పెద్ద మార్పులు కావలసివచ్చినప్పుడు మొత్తం దేశంలో యితరచోట్ల కూడ ఏమి జరుగుతున్నదో చూచి మన విశ్వవిద్యాలయములలో కూడ మార్పులు తేవడం మంచిది. అది సరైన పద్ధతి Inter University level లో మన విశ్వవిద్యాలయాల ఉపాధ్యాయులు కూడ మెంబర్స్‌గా ఉన్నారు వారితో సంప్రదించి, ఏ మార్పులు అవసరం ఉంటుందో ఆలోచనచేసి చేస్తామని మనవిచేస్తున్నాను ఈ సమయంలో యింతకంటే చెప్పవలసినది ఏమీలేదు దీనిని బలపరుస్తున్నందుకు సభ్యులందరికీ హృదయపూర్వక వందనములు అర్పిస్తూ ఈ బిల్లును పాస్ చేయించమని కోరుతున్నాను

*Mr Speaker* The question is

That the Andhra University (Andhra Pradesh Amendment) Bill 1957 be taken into consideration at once

The motion was adopted

*Clause 2*

*Mr. Speaker* The question is

That Clause 2 stand part of the Bill.

The motion was adopted

Clause 2 was added to the Bill.

*Clause 3*

*Mr Speaker* The question is

That Clause 3 stand part of the Bill.

The motion was adopted.

Clause 3 was added to the Bill.

*Clause 4.*

*Mr Speaker* · The question is .

That Clause 4 stand part of the Bill.

The motion was adopted.

Clause 4 was added to the Bill.

*Clause 5*

*Mr. Speaker*. The question is :

That Clause 5 stand part of the Bill.

The motion was adopted.

Clause 5 was added to the Bill.

*Clause* 1

*Mr Speaker* The question is

That Clause 1 stand part of the Bill

The motion was adopted

Clause 1 was added to the Bill

*Preamble*

*Mr Speaker* The question is

That the Preamble stand part of the Bill

The motion was adopted

The Preamble was added to the Bill

*Sri S B P Pattabhi Rama Rao* Sir, I beg to move

"That the Andhra University (Andhra Pradesh Amendment) Bill 1957 be passed into law"

*Mr Speaker*: The question is

"That the Andhra University (Andhra Pradesh Amendment) Bill 1957 be passed into law"

The motion was adopted

## THE SRI VENKATESWARA UNIVERSITY (ANDHRA PRADESH AMENDMENT) BILL, 1957

*Sri S B P Pattabai Rama Rao* Sir, I beg to introduce the Sri Venkateswara University ( Andhra Pradesh Amendment ) Bill, 1957 and move that the Bill be taken into consideration at once

Sir, in moving the Bill, under Section 15 clause 3 (4) of Sri Venkateswara Uuniversity Act, one person is elected to the Senate by the Municipal Councils and Presidents of Panchayat Boards in each District in the State of Andhra Under the existing provisions of the Act, person so elected need not necessarily be a member of the local body Under Section 31 (3) of the Act, any authority elected in his capacity as a member of a particular electorate shall not be deemed to be a member of such authority on his ceasing to be a member of that particular electorate However, under the proviso of this Section loss of membership is protected for a period of three months for those elected under Section 15 (3) (iv) even if they cease to be members of the electorate The University considers that this proviso was needed, as under the old Section of the Andhra University Act, the candidates had to be elected from the electorate When

the condition that a person to be elected should be from an electorate was removed, this proviso should have been dropped This was done due to oversight and so now we want to rectify that defect by removing the proviso and removing the anamoly

శ్రీ వెంకటేశ్వర యూనివర్సిటీ (1954) చట్టము ప్రకారము యూనివర్సిటీ సెనేటుకు లోకల్ బోర్డ్సు, మ్యునిసిపాలిటీల నుంచి ఒక మెంబరు ఎన్నిక అయి, అయిదు సంవత్సరములు సెనేటుసభ్యుడుగా ఉండవచ్చును ఆవిధముగా ఎన్నుకోబడవలసిన వ్యక్తి స్వయముగా ఒక మ్యునిసిపల్ కౌన్సిలరు గాని, లేక పంచాయితీ అధ్యక్షుడుగాని అయిఉండవలసిన అవసరంలేదు అయితే ఆ చట్టము లోని క్లాజు 31 (3) ప్రొవిజో ప్రకారం, పై విధముగా సెనేటుకు ఎన్నికఅయి వచ్చిన సభ్యుడు, లోకల్ బోర్డ్సు సభ్యత్వం ఎప్పుడైనను ఒకతూరి మూడు మాసముల కంటె ఎక్కువ కాలం పోగొట్టుకొంటే సెనేటు సభ్యత్వం కూడా పోతుందని ఉన్నది

అయితే బయటివారిని ఎన్నుకున్నప్పుడు, వారికి అటువంటి నిబంధన లేదు మూడు మాసాలలో తిరిగి రాకపోతే ఆ పదవి పోతుందనిలేదు ఇది కొంచం ఎనామెలెస్ పొజిషన్‌లోకి వచ్చింది సెనేట్ మెంబరుగా వచ్చేవారు జిల్లాబోర్డుల యొక్కగాని, మునిసిపాలిటీల యొక్కగాని, పంచాయితీల యొక్క గాని మెంబరు అయి ఉండటంవల్ల, తిరిగి ఎన్నిక కాకపోతే పోవటం, ఆ కాన్‌స్టిట్యుయన్సీలోనే పైవారు ఎన్నికైనప్పుడు, అటువంటి నిబంధన లేకుండా ఉండటం ఎనామెలెస్ పొజిషన్ పై వారికి ఉన్నటువంటి హక్కులే వారికికూడ ఇస్తున్నాము. పంచాయితీబోర్డు, డిస్ట్రిక్ బోర్డు, మునిసిపాలిటీ మెంబర్ షిప్ పోయినప్పటికీ, ఒకసారి ఎన్నిక అయ్యాక, ఆ టరమ్ అంతా తక్కినవారితో పాటు ఉండేటట్లుగా, ఆ ప్రొవైజో తీసివేస్తే సరిపోతుందనే ఉద్దేశంతో యీ సవరణ తెచ్చాము. ఇది పెద్ద విషయముకాదు ఆ ఎనామెలెస్ పొజిషన్ రిమూవ్ చేయటం, యీ సవరణయొక్క ఉద్దేశం గనుక, సభవారు దీనిని ఆమోదించవలసిందిగా కోరుతున్నాను.

*Mr. Speaker*. Motion moved :

"That the Sri Venkateswara University (Andhra Pradesh Amendment) Bill, 1957 be taken into consideration at once."

*శ్రీ ఎ. బి. నాగేశ్వరరావు (రాజమండ్రి) : అధ్యక్షా, యీ అమెండ్‌మెంట్ మూవ్ చేయటంలో ప్రభుత్వమువారు, స్థానికసంస్థల సభ్యులు అయినా, కాకపోయినా ఇతరులను కూడా ఎన్నుకోవచ్చని ఆ క్లాజులో ఉన్నది. ఇతరులను

ఎన్నుకొన్నప్పుడు, సభ్యత్వంపోదు. కాబట్టి 5 సంవత్సరాలు కంటిన్యూ అవుతాడని, పురపాలక సంఘాలలోగాని, పంచాయితీలలోగాని సభ్యులుగా ఉండి, ఆ మెంబర్‌షిప్ పోయినట్లయితే మూడు మాసాల అనంతరం తిరిగి ఎన్నిక కాకపోతే ఆ సభ్యత్వం పోతుందని, ఆ ఎనామెలీని సరిచేయటంకోసం యీ సవరణ చేస్తున్నట్లు మా ఎదుట ఉన్న "ఉద్దేశాలు - కారణాలు" లో ఉంది సభ్యుని ఎన్నుకోవటముతో, పురపాలక సంఘాలయొక్క, పంచాయితీల యొక్క ఇంటరెస్టు సేఫ్‌గార్డు చేయటంకోసమే అయినపుడు, ఆ సభ్యులలో నుండి ఒకరు మెంబరుగా ఉండేటట్లు ఎన్నిక జరిగేటట్లు చూచినట్లయితే, యీ ఎనామలే రాదేమో దయచేసి ప్రభుత్వంవారు ఆ సూచన తిరిగి ఆలోచిస్తారని ఆశిస్తున్నాను

మూడు నెలల తదనంతరం వారి మెంబర్‌షిప్ పోతుంది అన్నారు కొన్ని కారణాలవల్ల ఆ సభ్యుడు మూడు నెలలకు గాక, నాలుగైదు నెలలకు తిరిగి ఎన్నిక కావచ్చు. ఆ మెంబరే తిరిగి సెనేటుకు రావాలంటే, సెనేటువారు కలెక్టర్‌గారికి ఆదేశం పంపించి, మళ్ళీ పురపాలక సంఘాలు పంచాయితీబోర్డులు ఎన్నికలు కలిగించేదానికంటే, ఆ కాలపరిమితిలేకుండా మళ్ళీ ఆ సభ్యులే ఎన్నికైనట్లయితే రావటానికి సావకాశం ఉందేమో విచారించాలని ప్రభుత్వాన్ని కోరుతున్నాను ప్రస్తుతం మా దగ్గర ఉన్న annexure లో

No member of an authority specified in sub - section -(1) who is elected, nominated, appointed or co-opted in his capacity as a member of a particular electorate or the holder of a particular appointment shall continue to be a member of such authority on his ceasing to be a member of the particular electorate or the holder of the particular appointment అని ఉన్నది ప్రొవైజోలో ఏమి ఉన్నదంటే-

Provided that a member returned to the senate by the electorate referred to in Section 15, cl 3(iv) shall not cease to be a member of the Senate by his ceasing to be a member of such electorate for a period of less than three months at a time

ఇది ఒమిట్ చేయాలని మా ఎదుట ఉన్నది ఇది ఒమిట్ చేసినట్లయితే, అసలు ప్రభుత్వం ఏ ఉద్దేశంతో యీ సవరణ పెట్టిందో ఆ ఉద్దేశం సఫలీకృతం కాదని నా అభిప్రాయము కాబట్టి ప్రభుత్వం యీ విషయం తిరిగి ఆలోచించాలని కోరుతూ విరమిస్తున్నాను

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య . అధ్యక్షా, నాగేశ్వరరావుగారితో నేను కంప్లీట్‌గా ఎగ్రీ కావటంలేదు. ఇప్పుడు ఒమిట్ చేస్తున్నది మినహాయించేగా

పైన ఉన్నదాంట్లో చిక్కు ఉన్నట్లు అగుపిస్తున్నది On his ceasing to be a member of the particular electorate అంటే అతడు ఎలక్ట్ అయినప్పుడు ఎలక్ట్రేట్‌లోనే ఉన్నాడు కాని ఆ తరువాత అతడు మెంబరు కాడు. మన ఉద్దేశం ఏమిటంటే, ఆయన జిల్లాబోర్డు మెంబరో, మునిసిపల్ మెంబరో అయి ఉంటే, ఆయన ఎలక్టు అయి ఉంటే, ఆ విధంగా ఎలక్టు అయినతరువాత, అతడు కాకపోతే మూడు నెలల తర్వాత పోతుందేమోననే అనుమానంతోటి పెడుతున్నారు On his ceasing to be a member of the particular electorate or the holder of the particular appointment అన్నది ఎగిరి పోతుంది అది కాస్త లీగల్‌గా చూడవలసిన అవసరమున్నది జనరల్‌గా సభ్యులే ఉండాలని లేదు తక్కినవారు ఉండవచ్చు అని అన్నప్పుడు వారిని రిస్ట్రిక్ట్ చేయటం అంత న్యాయంకాదు, అని నాగేశ్వరరావుగారు చెప్పిన అభిప్రాయం వ్యక్తం అవుతున్నది మునిసిపల్ మెంబర్ కాకపోతే అతడు అర్డినరీగానే వస్తాడు మునిసిపల్ మెంబరుగా రావటానికి ఇంకొకనికి అవకాశం ఉన్నప్పుడు, అతను ఆ రోజున నిలబడలేదే, అతనికెట్లా వస్తుందనే ఒక గ్రీవెన్సు ఉన్నది అతనుకూడ కంటెస్టు చేయవచ్చు కవున్సిలర్‌గా ఉన్నవాని పొజిషన్ కన్నా, బయటివాని పొజిషన్ తక్కువగా ఉంటుంది, జిల్లాబోర్డు, మునిసిపల్, పంచాయితీబోర్డుల సభ్యుల యొక్క అభిమానం ఉన్నవారు ఎవరైనా రావచ్చు అన్నవిధంగా ఏదైతే ప్రొవిజన్ ఇచ్చారో అది ఉండవలసిన అవసరంలేదు మూడు నెలల తర్వాతకూడ అతడు మెంబరుగా ఉండటం మంచిదే కాని పై సెక్షన్ ఆ ఉద్దేశాన్ని వ్యతిరేకిస్తున్నది. మళ్ళీ ఇంకోసారి లీగల్ ఒపీనియన్ తీసుకొంటే మంచిదని భావిస్తున్నాను.

శ్రీ ఆర్. లక్ష్మీనరసింహం దొర (టెక్కలి): నేను నాగేశ్వరరావుగారితో ఒక భాగానికే ఏకీభవిస్తున్నాను. ఈ సెనేటు కాన్‌స్టిట్యూట్ చేయటంలో, ఫంక్షనల్ రిప్రజెంటేషన్ ఇచ్చే ఉద్దేశంతోనే వేరువేరు నియోజక వర్గాలను ఏర్పాటుచేశారు. మునిసిపాలిటీస్‌కు లోకల్ బాడీస్‌కు ఒక నియోజక వర్గం ఏర్పరుస్తున్న సందర్భంలో, సెక్షన్ 15, క్లాజ్ 8-4 మునిసిపాలిటీస్ వారు ఆ లోకల్ బాడీస్‌లో ఉన్న ఒకరిని (functional representative) ని చేయకుండా, ఎవరైనా కంటెస్టు చేయటానికి అవకాశం కల్పించింది. అది బాగు లేదేమోనని నాగేశ్వరరావుగారు తెలియచేశారు నేనుకూడ అలాగే ఊహిస్తాను. ఈ ఫంక్షనల్ రిప్రజెంటేషనే మన ఉద్దేశం అయినపుడు ఆ సెక్షన్ 15-8-4 ఎమెండ్ చేస్తే బాగుంటుందేమో అనుకొంటాను. నేనుకూడ మొదట యీ క్లాజు 8 లో సవరణ అవసరము ఉంటుందని అనుకొన్నాను. కాని అది

కాదు శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యగారు కూడ అలాగే అనుకొని పొరపాటు పడ్డారని అనుకొంటాను అక్కడ No member of an authority specified in sub-section (1) who is elected, nominated, appointed or co-opted in his capacity as a member of a particular electorate " అని ఉన్నది అన్నదాంట్లో 'in his capacity as a member' అన్నవి ప్రధానమైన మాటలు "In his capacity as a member of a particular electorate" లోకల్ బాడీస్ పంపించిన electorate లోకల్ బాడీస్‌లోని మెంబర్ కాడు He need not necessarily be a member of a local body for being eligible to be elected from that constituency

అందుచేత ఇది అప్లయి కాదు. అందుచేత మంత్రిగారు తెచ్చిన సవరణ అవసరమని నేను భావిస్తున్నాను

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య దొరగారు చెప్పిన తర్వాత నాకు ఇంకొక అనుమానం వస్తోంది 'In his capacity as a member' అన్నది తీసి వేయటం అవసరమేమోనని నాకు అనిపిస్తున్నది ఆయన మెంబరుగా రావటం లేదు మెంబర్ అయినా కాకపోయినా వస్తున్నాడు. అందువల్ల 'in his capacity' అక్కరలేదని తోస్తుంది

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు అధ్యక్షా, ఈ తిరుపతి వెంకటేశ్వర యూనివర్సిటీ బిల్లునుగురించి చర్చించేముందు నేను ఒక్క విషయము మనవి చేయ దలచుచున్నాను దీనిని క్రిందటిసారి సాకల్యముగ చర్చించి Local Boards, Panchayat Boards నుంచి మెంబర్లు ఎన్నుకో బడటానికి వీలుగా బైటివారికి కూడ అవకాశములు ఉండాలి అని అందరు ఆమోదించి ఒక సెక్షను అందులో ఏర్పాటు చేయడము జరిగింది తరువాత దీనిలో అది పెట్టినప్పుడుమాత్రము మంత్రిగారు వివరించినట్లుగా మేము ఎవ్వరముకూడ దీన్ని సరిగా ఆలోచించక పోవడమువల్ల యిందులోనికి ఆ సెక్షను దొర్లింది అందువల్ల ఇప్పుడు ప్రభుత్వము తీసుకుని వచ్చిన సవరణ చాలా అవసరమైనదనే మేము అనుకుంటున్నాము. కాబట్టి యిక్కడ యీ proviso ను omit చేస్తూ ఎప్పుడైతే ఆ లోకల్ బోర్డు మెంబరుగా వచ్చిన ఆయన cease అవుతాడో, అపుడు మామూలు outsider ఏ విధముగ ఎన్నుకోబడినాడో, ఆ విధముగానే ఎన్నిక అయినటువంటివారుగ పరిగణించడము న్యాయము, ధర్మము అని మేము అనుకుంటున్నాము ఈ కారణముచేత మేము దీనిని యిప్పుడు బలపరుస్తున్నాము.

మిస్టర్ స్పీకర్ దీనికి మంత్రిగారు ఏమైనా సమాధానము చెబుతారా ?

శ్రీ యస్ బి పి పట్టాభి రామరావు నేను చెప్పవలసిన సమాధానమే కొంత వెంకటేశ్వర్లుగారు, తక్కినది లక్ష్మీనరసింహం దొరగారు చెప్పారు గనుక యిక మీదట నేను చెప్పేది ఏమిలేదు అందువల్ల ఆ anomalous position నుంచి యీ proviso ను తీసివేయడమే మంచిదనినాయభిప్రాయము కూడ అంతేకాకుండా వెంకటేశ్వర్లుగారు చెప్పినట్లుగా Select Committee stage లోను, తరువాత యిక్కడ ఎసెంబ్లీలోను ఈ విషయమునుగురించి బాగుగ చర్చించిన తరువాత అందరికిగూడ అవకాశము ఉండే హక్కు యివ్వాలనే యీ మార్పు చేశారు అందువల్ల దీనికి మార్పు అవసరము లేదని అనుకుంటున్నాను

[ *Sri P Ramacharlu rose in his seat* ]

మిస్టర్ స్పీకర్ మంత్రిగారు సమాధానము చెప్పారు ఇక ఏమీ చేయటానికి వీలు లేదు

శ్రీ పి రామాచార్లు (ధర్మవరం-జనరల్) విశేషంగా ఏమి చెప్పడము లేదండి ఈబిల్లు సరిగా లేదని చెబుతున్నాను ఎందువల్లనంటే క్రింద ఉన్న proviso ను కొట్టివేసి తక్కినది అంతా అట్లాగే ఉంచితే, యీ మూడు నెలలు యిచ్చే అవకాశముకూడ లేకుండా పోతుందేమోనని అంటున్నాను ఇందులో "No member shall continue" అని ఉన్నది తరువాత మూడు నెలలుకూడ ఇచ్చే అవకాశము లేకుండా పోతుందని అంటున్నాను ఈ విషయము మంత్రిగారి దృష్టికి తెస్తున్నాను.

మిస్టర్ స్పీకర్ అసలు అది అవసరమే కాదని, delete చేస్తున్నారు.

*Mr Speaker* The question is :

"That the Sri Venkateswara University (Andhra Pradesh Amendment) Bill, 1957 be taken into consideration."

The motion was adopted.

*Clause 2*

*Mr. Speaker*. The question is :

That Clause 2 stand part of the Bill.

The motion was adopted.

Clause 2 was added to the Bill

*Short Title*

*Mr. Speaker* The question is

That the Short Title stand part of the Bill

The motion was adopted

The Short Title was added to the Bill

*Preamble*

*Mr Speaker* The question is

That the Preamble stand part of the Bill

The motion was adopted

The Preamble was added to the Bill

*Sri S B P Pattabhi Rama Rao* Sir, I beg to move

"That the Sri Venkateswara University (Andhra Pradesh Amendment) Bill, 1957 be passed into law"

*Mr Speaker* The question is

"That the Sri Venkateswara University (Andhra Pradesh Amendment) Bill, 1957 be passed into Law"

The motion was adopted

## BHADRACHALAM BOAT TRAGEDY ENQUIRY COMMITTEE REPORT

* *Sri R. Lakshminarasimham Dora* Sir, I want to raise a Point of Order I have, some time back, seen in the press that all those persons who are responsible for the tragedy have been prosecuted for murder under Section 302 and other Sections of the Indian Penal Code in a Court of Law and the matter is now pending Will we not be prejudicing that case by holding a discussion here on that subject, Sir? I submit that it will not be proper for us to discuss that matter when it is *sub-judice*

*The Chief Minister (Sri N Sanjeeva Reddi)* · Yes Sir, The matter is pending in a Court of Law Under Section 304, seven persons have been chargesheeted and the matter is before the Magistrate and the case is pending there. I feel that without touching upon the boat-men, contractors, etc., who are now facing the trial, it would

be very difficult to discuss this subject here We cannot say now whether they are responsible or not, because the matter is in a court of law Perhaps, my hon friends may suggest that we may be able to discuss the latter portion of the Report I do not know whether it would serve the purpose Any way, if it is discussed without reference to these persons I have no objection I think it would be very difficult to do that Therefore, I feel and propose that we should postpone the discussion on this subject to some other future time

శ్రీ పి సుందరయ్య అధ్యక్షా, ఈ విషయం Sub-judice అనే పేరుతో యీ చర్చ అవసరము లేదని అంటున్నారు కాని ఈ రిపోర్టు అంతాగూడ త్రోసి వేయనవసరము లేదని నా యొక్క విజ్ఞప్తి అసలు యీ కేసు దేనిమీద పెట్టారు? ఈ రిపోర్టుమీద కేసు పెట్టలేదు Committee వారు submit చేసినటువంటి report గాని, Boat tragedy అంతాగాని Sub-judice క్రిందకు రాలేదు అందులో కొంతమంది మీదనే కేసు పెట్టడము జరిగింది వారిలో నేరము చేశారా, లేదా వారికి నష్టకరమైన రీతిగా వర్తించాలా లేదా అనే విషయము కోర్టువారు విచారిస్తున్నారు అసలుబోటు మునగటానికికారణములు ఏమిటో! దానికి కారకులు అయిన కొంతమందిమీద మాత్రమే కేసుపెట్టి ఉండవచ్చు Boat tragedy కి సంబంధించినవి ఇంకను అనేక విషయాలు ఉన్నవి. దానికి Enquiry Committee ని వేశారు ఆ కమిటీ విచారించి అనేక recommendations చేసింది అందువల్ల యీ కేసుకు సంబంధించినవారు ఎవరెవరు, వారు ఆ నేరము చేశారా లేదా, అనే విషయాలను గురించి మాత్రము మనము చర్చించడము, దానిలోతుకు పోవడము జరిగితే అది తప్పకుండా Sub-judice క్రిందకు వస్తుంది నిజమే అప్పుడు అది కోర్టు ధిక్కారము క్రిందకు వస్తుంది. మనము రూల్సు ప్రకారము చర్చించ లేకపోయినప్పటికీ, అది శాసనసభ్యులు చర్చించకూడదు అనే విషయము నేను ఒప్పుకుంటాను కాని ఆ విషయము కాకుండా వారు 304 వ సెక్షన్క్రింద పడుగురుమీద పెట్టిన కేసు, వారు నేరము చేశారా లేదా అనే విషయాలలోకి మనము పోకుండానే. యింకను యీ Boat tragedy కు సంబంధించిన అనేక యితర విషయములు కూడ ఉన్నవి గనుక వాటిని చర్చించవచ్చు అందులో కమిటీవారు చేసిన సిఫార్సులు ఉన్నవి వాటి విషయముకూడ మనము చర్చించవచ్చు ఉదాహరణ చెప్పాలంటే, ఒకటి రెండు విషయాలు చెబుతాను. వారిమీద కేసు పెట్టితే, వీరే దానికి కారకులు అవునా కాదా అనే విషయాలలోనికి పోవక్కరలేదు. ఆ విషయము కోర్టువారు చూచుకుంటారు. కాని tragedy జరిగిన సమయములో అక్కడ పోలీసు ఉద్యోగస్థులు సరియైన బందోబస్తులు చేశారా, లేదా అనే విషయము ఒకటి ఉన్నది. కమిటీవారు submit చేసిన రిపోర్టులో పోలీసువారు

చేయగలిగినదంతా చేశారు, అంతకంటే ఆ సమయములో చేయగలిగింది ఏమీ లేదు. వారందరుకూడ అక్కడనే ఉన్నారు, అక్కడ అప్పుడు ఉన్నవారికశక్తి ఉన్నంతవరకు చేశారు అని వ్రాస్తూ కొన్ని precautionary measures ను ప్రభుత్వానికి recommend చేస్తూ రిపోర్టు పంపించారు కాని అందులో భేదాభిప్రాయాలు ఉండవచ్చు మనలో ఎక్కువమంది అవి ఆమోదించవచ్చు అది వేరేసంగతి ఇతరుల గురించి చర్చిస్తే అది Sub-judiceకు సంబంధించినది కాకపోవచ్చు, అలాంటి విషయాలు ఎందుకు చర్చించకూడదు ? అదే విధముగ అవతలగట్టున బోటుచేరే point అంటే బ్రాహ్మణరేవు దగ్గర పెట్టి ఉన్నట్లయితే బాగా ఉంటుంది అని ఒక సూచన చేశారు బ్రాహ్మణ రేవుదగ్గరగా కాకుండా యింకా కొంతమంది వేరేచోటు suggest చేశారు వారు యింకా కొన్ని యితర suggestions కూడ యివ్వవచ్చు అందువల్ల వారు ఆ నేరము చేశారా, లేదా, యీ పదిమందివల్లనే ఆ tragedy జరిగిందా అనే విషయాలు మనము చర్చించకూడదు చర్చిస్తే అది Sub-judice క్రిందకు వస్తుంది అలాంటివి మనము మినహాయించి, రిపోర్టులోని మిగిలిన విషయాలు చర్చించటానికి అవకాశము కలిగించాలని కోరుతున్నాను అందువల్ల Sub-judiceకు సంబంధించిన విషయాలు చర్చ సందర్భములో వస్తే, అవి అప్పటికప్పుడు వద్దుఅని warn చేసుకుంటూ మాట్లాడినట్లయితే, మిగిలినవి discuss చేయటానికి అవకాశము ఉంటుంది కనుక, యీనాడు యీ చర్చను వాయిదా వేయకుండా, చర్చ ప్రారంభించటానికి అనుమతి యివ్వవచ్చునని మనవి చేస్తున్నాను

* శ్రీ ఆర్. బి. రామకృష్ణరాజు (వడమలపేట) . అధ్యక్షా, ఈ Enquiry Committee లో నేను చైర్మనుగా ఉన్నాను Enquiry చేసేటప్పుడు facts గా ఏవేవి అయితే ఉన్నవో అవి అన్నీకూడ స్పష్టముగ విపులీకరించేరిపోర్టు తయారు చేయబడింది Facts అన్నీ బైటకు రావటానికే రిపోర్టు detailed గా తయారు చేశాము ఆ విచారణచేసే సమయములో సాక్ష్యము యిస్తామని వచ్చిన వారికి, ఏవిధముగాను ఆటంకము లేకుండా, వచ్చేవారికి అడ్డుతగలకుండా, వీలుఅయినంత మందికి అవకాశమిచ్చి సాక్ష్యము సేకరించాము ఆ వివరాలు అన్నీ రిపోర్టులో ఉదాహరించాము రిపోర్టులో మేము చేసిన సలహాలన్నీ సభవారు అంగీకరించవలెనా, వద్దా అనేది వేరే విషయము ఆ విషయాలను ఒక రిపోర్టు రూపములో మీ ముందు పెట్టాము మీరు దాన్ని గురించి ఏతీర్మానముఅయినా చేయవచ్చు పోలీసువారు దానికి ఎవిధముగా నైనా బాధ్యులా, కాదా అనే విషయము కూడ మీరు చర్చించవచ్చు, దానితో మా కేమి సంబంధములేదు, అయితే అక్కడ జరిగిన విషయాలు మాత్రము రిపోర్టు ద్వారా మీ ముందు పెట్టాము. ఇదిగాక జిల్లాబోర్డువారికి దీనితో సంబంధముఉన్నదా, లేదా, ఉంటే

ఎంతవరకు, tragedy జరగకుండా వారు ఏ ఏ జాగ్రత్తచర్యలు తీసుకుని వుండవలసింది, వారు బోట్లను ply చేయటానికి చేసిన రూల్సు, notification ఏమిటి అవి కూడ రిపోర్టులో వ్రాశాము వాటిని గురించి కూడ విమర్శించవచ్చు అయితే బోటు వారిని మాత్రము మినహాయించి, తక్కిన విషయాలు, అందులో కోర్టు విచారణకు సంబంధించని విషయాలు అన్నీ కూడ చర్చించవచ్చు అనే ఉద్దేశ్యముతో discussion ప్రారంభము చేసినను, ఎటూ చేరి, ఏదోవిధముగ sub-judice గాఉన్న విషయాలలోనికి ఒక్కొక్కప్పుడు పొరపాటుగా పోవచ్చును అది అంత జాగ్రతతో discuss చేయడమంటే కష్టతరమైన విషయమే కాబట్టి దీనిని గురించి నా అభిప్రాయము యేమీలేదు మీ యిష్టము వచ్చినట్లు పూర్తిగా చర్చ చేయవచ్చు లేదా కొంతవరకే చేయాలంటే చేయవచ్చు. అది మీయిష్టము గానీ, నాకు మాత్రము దీనిని గురించి ప్రత్యేక అభిప్రాయము ఏమీలేదు

**Sri P 'Basi Reddi (Pulivendla)* Sir, every incident relating to the tragedy will have bearing on the case which is in a Court of Law It is impossible to separate any incident from the facts of the case It is impossible to discuss any incident in isolation here So, the suggestion made by hon Sri P Sundarayya that things which are not connected with the case could be discussed here is not feasible There can be no fact which cannot have a bearing on the other facts of the case So, any discussion regarding the facts is likely to influence, directly or indirectly, the decision of the Court My submission is that it is improper to discuss the incident here before the disposal of the case by the Court

మిస్టర్ స్పీకర్ నేను గౌరవ సభ్యులు శ్రీ లక్ష్మీనరసింహదొరగారితో ఏకీభవిస్తున్నాను ఇప్పుడు చర్చకు అనుమతిస్తే, 'ఏమి జరిగింది ? ఎట్లా జరిగింది ? ఎవరెవరు వచ్చేరు?' అనే ప్రశ్నలు వస్తాయి. అవన్నీ యీ case కు సంబంధించినవే బోటులో సరైన precautions తీసుకున్నారా లేదా అంటే వారు దానిని గురించి defence లో చెప్పుకుంటారు. అసలు system ఎట్లా వుందనే ప్రశ్న కూడా లేదు The whole thing is sub-judice. ఎక్కడ బ్రిడ్జి కట్టాలి, ఏమి ? ఏవి చేయాలి ? అనే వాటినిగురించి ముఖ్య మంత్రిగారు శలవిచ్చినట్లయితే, ఆ అంశాల మీద మాత్రమే మాట్లాడితే నా అభ్యంతరం లేదు.

*Sri R. Lahshminarasimham Dora*. Then it would not be a discussion on the Enquiry Committee Report of the Bhadrachalam boat tragedy.

మిస్టర్ స్పీకర్ · ఇకముందు ఎక్కడ కడితే బాగుంటుంది ? యాత్రికులకు ఏసదుపాయాలు చేయాలి అనే అంశముల మీద చర్చించదలచుకుంటే అవకాశం యిస్తాము. పాత కథంతా యిది జరిగిపోయింది, యిది జరుగలేదు అని

చెప్పడానికి వీలులేదు The whole thing is sub-judice కావాలంటే బ్రిడ్జి ఎక్కడ కట్టాలి, చనిపోయినవారి కుటుంబానికి నష్ట పరిహారము ఎంత యివ్వాలి, గుడిలో పూజా పునస్కారములకు ఎక్కువ సౌకర్యాలు చేయాలా, అనే మూడు విషయాలపై చర్చించ దలచుకుంటే అవకాశం యివ్వగలను, లేకపోతే వెళ్ళిపోదాము

శ్రీ రాజా సాగి సూర్యనారాయణరాజు (నర్సీపట్నం - జనరల్) On a point of order, Sir తమరు బ్రిడ్జి ఎక్కడ కట్టాలనే విషయం చర్చించుదాం అంటున్నారు అది technical point కదా, మనం యేమి చర్చిస్తాం ?

మిస్టర్ స్పీకర్ Technical అయినా, యేదయినా చెప్పడానికి సభ్యులకు హక్కువుంది సూచనలు చేయివచ్చు తరువాత plan లు, estimate లు, వస్తాయి చనిపోయినవారి కుటుంబాలకు యిచ్చే నష్టపరిహారం విషయంలో చర్చించదలచుకుంటే అభ్యంతరంలేదు

శ్రీ పి సుందరయ్య అధ్యక్షా, Boat tragedy మీద యిదివరకే ఒక పర్యాయము చర్చించాము దానిని చర్చించాలని నేనుగాని మా పార్టీ వారుగాని ఆదుర్దాగా లేము అయితే యిదంతా sub - judice అని . .

మిస్టర్ స్పీకర్ . రూలింగ్ యిచ్చాను

శ్రీ పి సుందరయ్య మీరుకూడా కొన్ని మినహాయింపు లిచ్చారు

*శ్రీ యన్ సంజీవరెడ్డి పోలీసులు సరిగా లేనందువల్లనే యీ boat tragedy జరిగింది, మేము దానికి responsible కాదని రేపు కోర్టులో argue చేయవచ్చు In the Court, he will take that as a defence ఇది sub-judice కాకపోతే రిపోర్టు పై పూర్తిగా చర్చ చేయవచ్చును బ్రిడ్జికట్టడం, దేముడికి కర్పూరం యెక్కువ వేయాలా తక్కువ వేయాలా అన్నది శాసనసభలో చర్చ చేయడం అనవసరం అనుకుంటాను

మిస్టర్ స్పీకర్ : అంతవరకే confine చేస్తున్నాను.

శ్రీ పి. సుందరయ్య : దానిమీద recommendations వున్నాయి. అవి చాలునా చాలావా అని చర్చించవచ్చు. ఎవరో ఇంకో సభ్యులు Business Advisory Committee లో దీనిపై ఒక గంట చర్చ కావాలంటే మేముఅంగీకరించాము. ప్రతిపాదించిన వారికే అవసరం లేనప్పుడు దానిగురించి పట్టు పట్టవలసిన అవసరం మాకులేదు. మేము చెప్పదలచుకున్నది యిదివరకే చెప్పాము, మంత్రివర్గం "చర్యలు తీసుకుంటాం" అన్నారు. అందుచేత యిప్పుడు ప్రత్యేకంగా చెప్పవలసినది యేమీలేదు.

*శ్రీ ఎస్. లక్ష్మణదాసు (పాతపట్నం - జనరల్) Boat tragedy భద్రాచలంలో జరిగిన దానినిగురించి కాక దానిని దృష్టిలో పెట్టుకుని అనేక చోట్ల జరిగేవి తప్పించవచ్చును బోట్లను వేలం వేసినప్పుడు contractors వ్రాసి యిచ్చే agreement లో బోట్లు ఎటువంటివి వుండాలో వుంటుంది దానిని అనుసరించేటట్లు చేయవచ్చును వంశధారలో రెండు సంవత్సరాలక్రితం ఒక పడవ ప్రమాదంలో పదిమంది చనిపోయారు అటువంటివి తప్పించడానికి తగు సలహాలు యిస్తే ఉపయోగపడుతుంది

మిస్టర్ స్పీకర్ అది వీలులేదు ఇంకోచోట సంగతి చెప్పినప్పుడుకూడా యిది వర్తిస్తుంది వేలములను గురించి, contractor ను గురించి, ఆ పద్ధతులను గురించి యేమీ చర్చించడానికి వీలులేదు

శ్రీ ఎ. బి. నాగేశ్వరరావు రాజమండ్రి నుంచి భద్రాచలం పోలవరము లకు launches వెళుతూ వుంటాయి. పగలే కాకుండా తెల్లవారుఝామున రెండు గంటలకు మూడు గంటలకు launches బయలుదేరుతూ వుంటాయి. నాకు తెలిసినంతవరకు సాయంత్రం 6 గంటలు దాటినతరువాత నదుల మీద launches గాని, boats గాని నడవకూడదనే నిబంధనలున్నవి అవి strict గా enforce చేసినట్లయితే precautionary measure గా వుంటుంది కాబట్టిదయచేసి అది అమలుజరిపించవలసినదని కోరుతున్నాను శ్రీ రాజుగారు వ్రాసిన నివేదికలో ferries కు licences వున్నాయా లేవా చూడాలనివుంది ఆ నిబంధనలు కూడా పూర్తిగా అమలుజరిగేటట్లు చూడవలసినదిగా ముఖ్యమంత్రిగారిని కోరుతున్నాను.

శ్రీ ఆర్. బి. రామకృష్ణరాజు మా రిపోర్టులో, చనిపోయినవారి వారసులకు కొంత సహాయము చేయవలసినదని ప్రభుత్వానికి సూచన చేసినాము. దాని విషయమై యేమి చేసినారో చెబితే బాగుంటుంది.

*శ్రీ యన్. సంజీవరెడ్డి : వారి రిపోర్టు రాకముందే, accident అవడం తోటే compensation యివ్వాలనే decision తీసుకున్నాము అందరు కలెక్టర్లకు వ్రాశాము చనిపోయినవారి కుటుంబం యొక్క వివరాలు, ఏ రకంగా dependants, పురుషుడు చనిపోతే ఆయనకు భార్య వుందా, పిల్లలున్నారా, ఏ stage లో వున్నారు, చనిపోయినవారికి ఆస్తులున్నాయా అవే లోగట్టా ప్రతి కలెక్టరుకు జాబులు వ్రాసి, అరడజను రిమైండర్లు పంపించి తెప్పించుకున్నాము. Hard cases విచారించి, వారికి compensation యివ్వబడింది. ఎక్కడయినా తామ పోషిస్తున్నవారు చనిపోయినట్లయితే వెంటనే compensation యివ్వాలని ఉత్తరువు లివ్వబడ్డాయి.

*శ్రీ ఆర్. బి రామకృష్ణరాజు ప్రభుత్వంవారు చాలా liberal గానే యిచ్చినారని తెలిసినది ప్రతివారికి 500 రూపాయలు మొదలు 900 రూ॥ల వరకు యిచ్చినారు. 15 మందికి 10 వేల చిల్లర యిచ్చినారు అంతేనా, యింకేమైనా వుందా ?

శ్రీ యన్. సంజీవరెడ్డి . భోగట్టా ఎవరు అందచేసినా తీసుకోడానికి సిద్ధముగా వున్నాను నాకువచ్చిన భోగట్టా యేమిటంటే చనిపోయినవారిలో చాలమంది ఆడవారు భర్తలు మిగిలారు చనిపోయినవారిలో కొంతమందికి 10 ఎకరాల పొలం వుంది Dependants వుండి, భార్యవుండి భర్తలు పోషిస్తున్న వారుంటేనేకదా compensation ప్రశ్న arise అవుతుంది?

శ్రీ ఆర్ బి రామకృష్ణరాజు 13 మందికో 15 మందికో యిచ్చినారని నాకు తెలిసినది నాకు యిప్పటికీ అనేక దరఖాస్తులు వస్తున్నాయి. ఇంకా యేమయినా విచారణలో వున్నవా ?

శ్రీ ఎన్ సంజీవరెడ్డి ఇప్పుడు కూడా విచారణలో వుంది రేపు భోగట్టా యిచ్చినా చూస్తాము It is a continuous processs భోగట్టా చేరితేచాలు, యిస్తాం.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య · ఈ compensation విషయంలో, చనిపోయినవారి భార్యలు పడవరని పేరు వ్రాశారో ఆ ఊర్లో లేరు. తరువాత application పెట్టుకున్నారు. అదికూడా consideration చేస్తున్నారా ?

*Sri N Sanjeeva Reddi* No rule is followed regarding compensation ఎవరయినా సరే "బాధపడుతున్నాం, నష్టపడ్డాము" అని తెలిపితే విచారించి యివ్వడానికి సిద్ధంగా వున్నాను మా దృష్టికి తీసుకు రావచ్చు verify చేసి డబ్బు అందజేస్తాం There is no hard and fast rule.

మిష్టర్ స్పీకర్ · ఎల్లుండి ఉదయం 8-30 గంటలవరకు సభా సమావేశము వాయిదా వేయడమైనది.

***The House then adjourned till Half Past Eight of the Clock on Monday, the 11th November 1957.***